పుత్త్రుం డైనయుగ్రశ్రవుం డనియెడుకథకుండు సమ్యగవధానంబున నాకర్ణిం
చినవాఁ డగుటను సమాశ్రితవత్సలుం డైనయాకృష్ణద్వైపాయను ననుగ్ర
హంబునఁ దత్కథాసాకల్యవిసరణవిశారదుం డై యుండు నతండు నైమిశా
రణ్యపుణ్యక్షేత్త్రంబునందు శౌనకుం డనుకులపతి మొదలుగాఁ గలకొందఱు
మహామునులు సత్త్రయాగం బాచరించు చుండ నయ్యెడకుం జని వారలం
గాంచినఁ బుణ్యకథాశ్రవణకౌతుకాధీనమానసులై యమ్మాననీయులు పుణ్యా
త్మకుం డైనయక్కథకునకు సముచితార్చనంబులం బ్రియం బొనర్చి కథా
కథనంబుఁ బ్రసంగించినం బ్రీతుం డై యాతం డేమి తెలుంగుకథ వినం గో
రెద రనుటయు సత్పరమార్థపరాయణు లతనితోడ నెయ్యది హృద్యంబును
సపూర్వంబును సమగ్రజ్ఞానప్రదంబును నఘనిబర్హణంబును నైనయది య
క్కథ మాకు విన నిష్టం బని పలుకుటయు. 77

క. అతఁ డింతటిది మహాభారతంబ యనునిశ్చయము దిరంబుగ మతిసం
గత మగుడు నమ్మహాత్ముల, కతివిశదము గాఁగ నమ్మహాకథ సెప్పెన్. 78

వ. చెప్పి యి ట్లనియె నట్లు జనమేజయుండు సర్పయాగకర్మానుష్ఠానంబులయెడ
వైశంపాయనువలన నివ్విను తేతిహాసంబు విని విస్మితుండును బ్రమోదభరితుం
డును నయ్యె నక్కాలఁదిఁ దదీయయాజకులు యజనసమాపనవిధి యనుష్ఠించి
రయ్యుధిష్ఠిరానుజపుత్త్రపౌత్త్రుఁ డత్తెఱంగున భుజంగంబులయాపద దీర్చిన
యాస్తీకు నభ్యర్చనంబున నత్యంతసంతుష్టునిం జేసి యతని నివాసంబునకు
ననిచి పుచ్చి ఋత్విజు లాదిగా నఖిలబ్రాహ్మణులకు బహుధనంబు లొసంగి
వినయం బెసంగ నామంత్రితులం జేసిన వారలు నిజనివాసంబులకుం జనిరి
వైశంపాయనుఁ బెంపారువిశేషపూజనంబులఁ బరితోషితుం గావించి దేవోప
చారంబులఁ గృష్ణద్వైపాయనమునీంద్రుం బూజించి యజ్ఞపతి సకలజనం
బులు ప్రస్తుతింప విభవంబు శోభిల్లఁ బురంబుఁ బ్రవేశించె. 79

సీ. అని చెప్పి యాశౌనకాదిమునీశ్వరగణముతో మఱియు నక్కథకుఁ డింపు
మిగులంగ ని ట్లను మేటిమునీశ్వరసంఘంబులో నెల్ల సత్యదర్శి
సర్వవిధిజ్ఞాత సర్వవిజ్ఞానభవ్యాత్ముండు సర్వేంద్రియప్రబోధ
శాలి సర్వజ్ఞుండు శౌచశాంతిక్షమాదాంతితపోనిత్యతావిభాసి

తే. యాప్తసర్వవిధైశ్వర్యుఁ డఖిలసాంఖ్య, యోగభేదవిదుండు ధర్మోపదేశ
చతురవాగ్విలాసుండు నిస్తత్త్వవస్తు, వేదిసాత్యవతేయుండు వేదమయుఁడు.

వ. పాండవులకీర్తిం బ్రకటించుటకును మఱియుం గొందఱు జనపతులచరిత్త్రంబులు
జనుల కెఱింగించుటకును దేవదేవుం డగు వాసుదేవుని సంక్రీడావిశేషంబులు
వివరించుటకును సర్వదేవజాతులజన్మంబులును దదీయసాయుజ్యంబులును దేట
పఱుచుటకును సకలధర్మంబులునుం దెలుపుటకును గాఁ బంచమవేదం బయి

పరఁగునిమ్మహాభారతసంహిత యొనర్చె నిమ్మహితేతిహాసంబు సంవత్సరత్రయ
కృతంబు దీనివిశేషంబు వినుండు. 81

తే. అమలధర్మార్థకామమోక్షములగుఱిచి
యొలయుతెరు [1]వెద్దియును నిందుఁ గలుగునదియు
యొండెడలఁ గల్గు దీన లేకుండు చొప్ప
దర్కకంటను లేదు వేదజ్ఞులార. 82

సీ. పూతాత్ములార యీపుణ్యేతిహాసంబు జనమేజయుఁడు సేయుసర్పసుఖము
కాలంబునం దట్లు కారుణికోత్తముఁ డైనవేదవ్యాసుఁ డాదరమున
నాజ్ఞాపనము సేయ సతనిశిష్యుఁడు లోకనుతుఁడు వైశంపాయనుండు సెప్పె
నన్నరేంద్రుఁడు విన నాసభ నిలిచి సవినయభక్తికముగ వినినవాఁడఁ
తే. గథనశక్తియు నమ్మునికరుణవలనఁ, గలిగె నాకిత్తెఱంగున గారవించి
మీరు విను చుండఁ జెప్పెడుమేటిపనము,గంటి మంటి మీదయ పెంపుకతనఁజేసి.

వ. అని పలికి వెండియు. 84

-ఫలశ్రుతి-

క. అలఘుమతులార పర్వం,బుల నీయితిహాసరత్నమును వినిన నఘం
బులు వాయు నాకలోకము, గలుగును సిద్ధించు ముక్తికాంక్షిత యైనన్. 85

క. ఆద్యంతంబును నీయన, వద్యకథ వినంగఁ గనినవారికిఁ బాయుర్
సద్యంబ బ్రహ్మహత్యా,వద్యము మొదలైనపాపవర్గం బెల్లన్. 86

క. సురపితృకార్యంబుల భూ,సురులకు దీని వినిపించుసుకృతాత్ముఁడు ద
త్కారణఫలంబుల నధిక,స్ఫురితంబుగఁ బడయు మహితబోధనులారా. 87

క. మానసముల నింద్రియముల, నేనియుఁ జేయంగఁబడినయేనఃపుంజం
బీనిర్మలేతిహాసము, వీనుల నొక్కింత సెలుక విరియు సకలమున్. 88

ఉ. భ్రాజితవృత్తిమైఁ బరఁగుభారతసంహిత సంయమీంద్రులా
రా జయనామకంబునను రాజితభంగి జగత్త్రయంబునం
బూజితకీర్తి యై నెగడుభూరిజయోన్నతిఁ గంద్రు దీనిచే
రాజు లిలాసురుల్ మఱి యరాతుల గెల్తురు విన్నయంతటన్. 89

ఉ. భారత మర్థితో వినిన భక్తిఁ బఠించిన శ్రీయు నాయువుర్
భూరియశంబునుం బ్రమదమున్ దృఢవిద్యయుఁ గల్గు వారి కే
కోరిక లైన వేగ మొనఁగూడు సుపుత్త్రునిఁ గాంచు సద్వధూ
గౌరవ మొప్పఁగాఁ బడయు గర్భిణియున్ వరుసం గుమారియున్. 90

ఉ. శిక్షితచిత్తులార శుభసిద్ధులు వొందు ననేకజన్మపా

1 వెద్దియే నిందుఁ... గల్గి దీన లేకుండు చొప్ప.

పక్షపణంబునన్ వెలుఁగు భారతసంహిత కెల్లఁ బుండరీ
కాక్షుని వాసుదేవుఁ బ్రకటార్థముగాఁ గని విన్నమానవుం
డక్షయపుణ్యలోకములయందు రమించు నిరామయస్థితిన్. 91
ఉ. వ్యాసమునీంద్రసారకరుణాతిశయంబున భారతార్థ ము
ద్భాసిత మైనయట్టినుతభాగ్యునకున్ సకలాగమార్థసం
వాసన మానవిల్లు జనసంక్తులు గీర్తన సేయ శశ్వదు
ల్లాసముఖానుభూతి నచలస్థితి నొప్పు నతం డుదాత్తుఁ డై. 92
వ. అని యిట్లు సమస్తపురాణపారీణుం డైనసూతుండు. 93
చ. పరమపదాప్తిహేతు వగుభారతసంహిత శౌనకాదిభూ
సురవరు లింపునం గరఁగుచొప్పునఁ జెప్పిన వారు మోదసం
భరితతఁ బొంది యక్కథకుఁ బ్రీతిగ నర్చితుఁ జేసి రర్మిలిన్
హరిహరనాథ సర్వభువనార్చిత నన్ దయఁజూడు మెప్పుడున్. 94
ఉ. పావన దుర్దశాపహ శుభప్రదమూర్తి సుధానుభూతిసం
జీవితభక్తలోక తులసీదళదామ కపాలమాలికా
భావిభవాభిరామ పరిపక్వతపఃఫలరూప సాంఖ్యవి
ద్యావహయోగశక్తివిశదాద్భుతఖేలన లోకపాలనా. 95
క. దేవాదిచతుర్విధభూ,తావాసా సుకృతహృదయ హారివిలాసా
కేవలభావానందమ,యా వేదవ్యాసవర్ణ నాయాథదయా. 96
మాలిని. అకృతకమధురోక్తివ్యాప్తసందీప్తసారా
సకలభువనరక్షాశాలిశుంభద్విహారా
శుకజనకమనీషాశుద్ధబుద్ధానుభావా
సకృపకృతవిలాసా సంభృతానందభావా. 97

గద్యము. ఇది శ్రీమదుభయకవిమిత్త్ర కొమ్మనామాత్యపుత్త్ర బుధారాధనవిరాజి తిక్కనసోమయాజిప్రణీతం బైన శ్రీమహాభారతమునందలి స్వర్గారోహణపర్వంబు సర్వంబు నేకాశ్వాసము.

శ్రీమదాంధ్రమహాభారతము
సంపూర్ణము.

శ్లో. యదక్షరపదభ్రష్టం మాత్రాహీనం తు యద్భవేత్,
తత్సర్వం క్షమ్యతాం దేవ నారాయణ నమోఽస్తు తే.

---

చెన్నపురి: ... ముద్రితము.—1923.

